# మధుసేవ

## ( తాగుబోతులూ జిందాబాద్ ! )



### కాళ్ళకూరి నారాయణరావు

2

MADHU SEVA

By

KALLAKURI NARAYANA RAO

First Edition : 1926

JAYANTI PUBLICATIONS
Vijayawada-500 002

EDITION :
January: 1993

Price :
**Rs. 10-00**

Printers :
SATEESH PRINTERS
Vijayawada-11.

# మహాకవికి నివాళులు

శ్రీ కాళ్ళకూరి నారాయణరావుగారు కవి, పండితుడు, రచయిత, సంస్కర్త, సంఘసంస్కర్త కూడాను.

వీరు నాటకాలు, నవలలు, కథలు, ప్రహసనములు, చారిత్రక గ్రంథాలు, విమర్శనాత్మక రచనలు, వ్యాసాలు, పద్యాలు రచించి సాహిత్యాన్ని అన్ని కోణాల నుంచి దర్శింపచేశారు.

వీరి రచనలలో ప్రముఖంగా ప్రాచుర్యము పొందినవి 1. వర విక్రయం, 2. మధుసేవ, 3. చింతామణి.

వీరి రచనలు సంఘంలో జరిగే చెడును సున్నితంగా అపహాస్యం చేస్తూ, సంస్కరణ వైపు నడిపించేవిగా రూపొందాయి.

కాసుకు లోనై కన్నియను అమ్మే దురాచారాన్ని ఖండిస్తూ మహాకవి గురజాడ 'కన్యాశుల్కం'గా రూపొందించగా, మహాకవి కాళ్ళకూరి 'వర విక్రయం' అనే శీర్షికతో వరుడు ఏ విధంగా కట్నం అనే పదానికి లేని గౌరవం కల్పించుకొని ఎలా అమ్ముడుపోతున్నాడో మనకు కళ్ళకు కట్టినట్లుగా చిత్రించారు.

'మధుసేవ' కు ఎంత వ్యంగ్యాత్మకమైన పేరుపెట్టారు. మద్యపాన దాసుడైన వ్యక్తి తన వ్యసనం వలన తాను నాశనమౌతూ, తన భార్యాబిడ్డలను సైతం ఆకలి మంటలకు ఎరచేస్తూ తన కుటుంబ సర్వనాశనానికి ఎలా కారకుడవుతున్నాడో నిరూపించారు. జాతీయోద్యమ రోజుల్లో 'కల్లు మానండోయ్ బాబూ, కళ్ళు తెరవండోయ్' అంటూ

అలపించిన ఆ గొంతులే ఈ నాడు కల్లు, బ్రాందీ, విస్కీ అంటూ ఆలా పిస్తున్నాయి.

ఈ నాడు వీధి వీధినా, వాడ వాడలా బ్రాందీ, విస్కీ షాపులు, బార్‌లతో నిండిపోయిన ఈ దేశం ఈ జాతికి ఇచ్చే నాగరికతా సంస్కృతులు ఇవేనా! నైతికంగా ఎంత పతనమైంది ఈ జాతి!

ఇక 'చింతామణి' నాటకానికి వస్తే స్వార్థపరులు కొందరు ఒక వర్గపు స్త్రీలను దేవదాసీలు అంటూ పవిత్రమైన పేరుపెట్టి, వెల యాండ్రుగా మార్చి తమ కామ దాహానికి పరికరంగా ఎలా ఉపయోగించు కొన్నారో చూపించారు. యుక్త వయస్సు రాగానే వేశ్యా మాతలు మన వృత్తి అంటూ అమాయకులయిన తమ కన్నె పిల్లలను సైతం పెడదారిపట్టించి వారి పతనానికి బాట వేశారు. ఇందులో ఒక భాగమే చింతామణి. సంఘంలో ఈ వినాశకర వృత్తిని త్యజించి చింతామణి తాను సంపాదించిన ఆస్తినంతా దాన ధర్మాలు చేసి చివరకు విరాగిణిగా మారి, తన్ను తాను సంస్కరించుకొంది. ఈ సంస్కరణ ప్రధానమయిన నాటకాన్ని కొందరు ఎంత వికృతంగా, జుగుప్సాకరంగా ప్రదర్శిస్తున్నా రంటే ఆ నాటకాన్ని రూపొందించడంలో రచయితకు గల సదాశయాన్నే అపహాస్యం చేసారు. అది దారి తప్పిన మన తెలివితేటలకు నిదర్శనం. ఏది ఏమయినా మహా కవి కాళ్ళకూరి రచనలు తెలుగు నాట సాంఘిక సంస్కరణోద్యమానికి మణిదీపాలు, మార్గదర్శకాలు. తెలుగు నాటక సాహిత్యానికి జీవకర్రలు, ఆ మహనీయునికివే నివాళులు.

I-1-93 ఇట్లు,

విజయవాడ యం.పి. రావు.

# అవతారిక

మన దేశమున కిప్పుడు మద్యపానము మహత్తరశత్రువై యున్నది! ఈ దుర్వ్యసనమునకు లోనైన వారీదేశమున నిప్పుడు రెండుకోట్లయిన నుండకపోరు! బ్రాంది, విస్కీలవారి యెక్కుడు వ్యయమును, కల్లుసారాల వారి తక్కువ వ్యయమును గలిపి, తలకు దినమున కెనిమిది యణాల వంతునఁజూచినను రెండుకోట్ల మీఁదను, దినమునకుఁ గోటిరూప్యములు దగ్ధమగుచున్నట్లు తేలుచున్నది. అనఁగా; సంవత్సరమునకు మూడు వందల యఱువది యైదు కోట్లన్నమాట! అనగా; మనదేశముపై దొరతనము వారికి వచ్చు నాదాయముకంటె రెండురెట్లధిక మన్నమాట! ఈ దుర్వ్యసనము హరించి, ఈ సొమ్ము మిగిలినచో మనదేశము మహైశ్వర్యముతోఁ దులఁదూఁగదా! ఇప్పటి నేరములు ఇప్పటి హత్యలు ఇప్పటి కోర్టులు ఇట్టే రూపు మాయవా! ఇంతకన్న స్వారాజ్యమిఁక నేమున్నది! కాఁబట్టి, ఈ ప్రబల శత్రువును భస్మీకరించుటకై ప్రయత్నింపవలసిన బాధ్యత ప్రతి భారతీయునియందును గలదు. ఈ రూపముగా నా బాధ్యతను నిర్వర్తించుకొను తలంపుతో నే నీ రూపకమును వ్రాసినాడను. ఫలితము భగవదధీనము !

పాత్రౌచిత్యము కొఱకును, బామరజన సుబోధము కొఱకును గావించిన భాషాసాంకర్యములనేమి, ప్రమాదములనేమి పండితులు మన్నింపఁగల రని భావించుచున్నాఁడను, గ్రంథమును గడతేఱఁజూడకయే, గ్రంథకర్త యుద్దేశమునుగూర్చి కాసింతయేని యోజింపకయె, సవరణముల నుపపాదించు సాహసికులను కలములను, కాగితములను బాడుసేయవల దని కడుంగడుఁ బ్రార్థించుచున్నాఁడను.

కాకినాడ,
1—5—26.

—కాళ్ళకూరి నారాయణరావు

**A perfect judge will read each work of wit,
with the same spirit that its author writ.**

# ఇందలి పాత్రలు

1. రఘు–రఘునాథరావుగారు—కథానాయకుడు
2. విశ్వా– విశ్వాసరావు—రఘునాథరావుగారి మేనేజరు
3. శర్మ– రఘునాథరావుగారి దుష్టస్నేహితుడు
4. నిర్మ– నిర్మల—రఘునాథరావుగారి భార్య
5. కస్తూ– కస్తూరి—వేశ్య
6. చిన్న– సిపాయి చిన్నయ్య—రఘునాథరావుగారి నవుకరు
7. రంగ– రంగడు. ఒక త్రాగుబోతు
8. వెంక– వెంకటేశము—కస్తూరి తమ్ముడు
9. కాసిం– కాసింసాహేబు—కస్తూరి రహస్యవిటుడు
10. ఇన—ఇనస్పెక్టరు
11. మేజి—మేజిస్ట్రేటు
12. ప్రాసి—ప్రాసిక్యూటరు.
13. పంతు– పంతులు—రఘునాథరావుగారి వకీలు
14. నాయు–నాయుడు—కస్తూరి శర్మల బారిష్టరు.

# మధు సేవ

## నాంది

గౌరవ మాయువున్ సిరి సుఖంబును ద్రవ్వియు రూపడంచి, పై
వారికి హేయబుద్ధి, తమవారికి వ్యాకులమున్ ఘటించి, ని
స్సారులం జేయు దుర్వ్యసన సంతతి పాల్పడకుండ మా సభా
స్తారుల నీశ్వరుండు సతతంబును సత్కృపఁ గాచుఁగావుతన్!

### ప్ర స్తా వ న

సూత్ర—(ప్రవేశించి) ఓహో! నేఁటిసభ నేత్రపర్వముగా నున్నదే?

సీ. తక్కువ తరగతి టిక్కెట్లు కొని, మీఁది
చోటుల కేగి కూర్చుండువారు
క్షణము జాగైనచోఁ జప్పటు చఱచుచుఁ
గెవ్వున నీలలు రువ్వువారు
ఇంచుకంత ప్రమాద మెందేని వాటిల్ల
గొబ్బున లేవిడీల్ గొట్టువారు
సమయాసమయముల సంగతి లేకుండ
వన్సుమో రని బిట్టు వదరువారుఁ
గాక కోవిదులును, గుణగ్రహణపరు, లు
దారమానసులును, సావధానమతులు
నైన ప్రముఖులె విచ్చేయు నట్టిభాగ్య
మబ్బినది నేఁ డి దేమి పుణ్యంబొకాని!

(పరిక్రమించి, చేతులు మోడ్చి) ఓ సభాస్తారులారా!

సీ. పసితనమందె పావనవర్తనమునందు
జాగుగ నలవాటు పడినవాఁడు

అప్రయత్నంబుగ నఖిలవిద్యలతోడఁ
గరమును బరిచితిఁ గన్నవాఁడు
బహుకృతి స్వీకార భాగ్యంబునందు స
మానులు తన కెందు లేనివాఁడు
ఎద్ది వచ్చిన మంచికే యను తత్త్వ మ
త్యంతంబు దృఢపడి నట్టివాఁడు
పాలుమాలిన యనియెడు పదము తనదు
కోశముననె లే దనిపించు కొన్నవాఁడు
బుద్ధిరాజాన్వవాయాబ్ధి పూర్ణచంద్రుఁ
డనుపమానుండు వీరభద్రాహ్వయుండు.

అమ్మహాసీయున కంకితముగా మహాకవి కాళ్ళకూరి నారాయణ రాయనిచే రచియింపఁ బడిన మధుసేవ యను మహాప్రకరణ మిప్పుడు మీ సన్నిధిని బ్రయోగించు భాగ్య మబ్బినందులకుఁ బరమానందము నొందుచుఁ బ్రమాదములను మన్నింపఁ బ్రార్థించుచున్నాఁడను. (తెర వంకఁ జూచి) ప్రియురాలా! ఏమి....తడవు? ఏ మంటివి?—"మీ యనుజ్ఞయె తడ"వనియా?– అట్లయిన, సభామంటపమునకు సమ్మోహన మంత్రముగా ముందు నీవు కొంచెము పాడుము.

తెరలో—

చ. వనజభవాండమెల్ల గెలువం బయనం బగు పుష్పసాయకుం
దనుప వసంతుఁ డాసవయుతంబుగ నిల్పిన పానపాత్రలో
యన నలవిచ్చినట్టి కుసుమావళు లాసవపూరితంబు లై
కనులకు విందొనర్చు నధికంబుగ ని మ్మధువాసరంబులన్.

సూత్ర:— సెబాసు! చక్కఁగాఁ బాడితివి! ఇదిగో నేను వచ్చి, సభ్యులకు నీ సంగీతామృత మైకము తగ్గకమున్నె రఘునాథరాయ పాత్రను బ్రవేశ పెట్టెద. (నిష్క్రమించును.)

ఇది ప్రస్తావన.

# ప్రథమాంకము

ప్రవేశము: రఘునాథరావుగారి మేడమీఁది కచేరిచావడి

ప్రవేశము:- రఘునాథరావుగారు పడక కుర్చీలోఁ గూర్చుండి పత్రిక చదువుకొనుచు,

రఘు:- (చదువు నిలిపి, యొక్కనిట్టూర్పు పుచ్చి) మొత్తముమీఁదఁ బరిస్థితులన్నియు బహుభయంకరములుగా నున్నవి!

చ. కఱవొకవంక! జాతి మతకక్షలొకానొకవంక! హత్యలున్
మరణము లొక్కవంక! దయమాలిన ధర్మవిరుద్ధ చర్యలున్
జెఱలొకవంక! నోటికిని చేతికిఁ గట్టడు లొక్కవంక! ఈ
తెలుఁగున దేశ మెల్ల నతిదీనదశావశ మయ్యె నే మనన్!

చ. తలకని స్వేచ్ఛతోఁ, బటువు తప్పి యెఱుంగని పౌరుషంబుతో,
నెలకొను శాంతితో, దిశను నిండిన కీరితితో, సమిష్టితోఁ
దొలఁగని భోగభాగ్యములతోఁ దులదూఁగిన దేశ మిప్పు డి
ట్టులు తలక్రిందులై, కుడిచెడు స్థితిలేని విపత్పరంపరల్!

(క్షణ మూరకుండి) మన దేశమున కెన్నఁడైన మరల మంచి యోగము పట్టునా!...ఎక్కడి యోగము...ఎక్కడి లోకము!

సీ. కొంపలు తెగనమ్మి కోర్టుల, రైళ్ళఁ, గా
ఫీ హొటేళ్ళ, వకీళ్ళఁ బెంచువారు
పండిన సరకెల్లఁ బరదేశముల కంపి
కఱవున కిర వేలుపఱుచువారు
మూడుప్రొద్దుల ముష్టి మూన్సిపల్ మెంబరు
పదవిలోఁ గనులు కన్పడనికారు
ఆస్తి భార్యలపేర అప్పులు తమపేరఁ
బెంచి, ఐ. పీ, లను బెట్టువారు

బట్టకొలకుఁ, జుట్టకొలకు, బ్రాందికొలకు
సిరులు పరదేశములపాలు సేయువారుఁ
బూరిగా నెల్లెడల వట్టిపోవుదనుక
దేశమునకీ యరిష్టము తీఱఁబోదు!

(ఉలికిపడి) ఏమిచెపుమా యా గోల! (అని లేచి గవాక్షముగుండ వీధివంకఁ జూచి) ఎవనినో తప్ప త్రాగిన దౌర్భాగ్యుని దండభటులు, చచ్చిన గేదెదూడనుబలెఁ జరచర నీడ్చుకొని పోవుచుండ సోమరులు కొందరు చోద్యముగ్రిందఁ జూచుచు వానిని వెంబడించినారు! సిగముడి వీడ, సింగారించిన పుట్ట మూడ, ఒడ్డునఁ బడ్డ చేఁపవలె, ఓడ దిగిన నావి కునివలె, తేపతేపకుఁ దెయితక్కలాడుచు, అనువు తప్పిన యవయవము లతో, అలుకుపాఁత లైన యుడుపులతో; పెంట లూడ్చిన తలతో, పెచ్చు లూడిన యొడలితో మద్యపానమువల్ల నీమందభాగ్యుఁ డేమి యానంద మనుభవించు చున్నాఁడో!

చ. జలములు గ్రోలి కుంజరము సత్త్వసమృద్ధి మెలంగ నేర్చు, నా
జలములె త్రావి సింహ మతిశౌర్యబలప్రతిభాస్థితి న్మదా
వళ ఘన కుంభయుగ్మమును బ్రద్దలు సేయును; వీని నాత్మలోఁ
దలఁపక, మానవుండు సురఁ ద్రావఁగఁ గోరు నిదేమి వెఱ్ఱియో!

చిన్నయ:- (ప్రవేశించి) బాబూ! రంగఁ డీపూట కొంచెం దమ్ముసీళ్ళు బిద్దకించి, పెళ్ళాన్ని కొట్టబోతే, ఆ దెబ్బ, అడ్డఁవెళ్ళిన అత్త గారికి తగిలిందంటండి, అందుకోసము పోలీసువా రాయెద వను టేశను కిడ్చుకుపోతున్నారంటండి. యేల్నివారితో ఈ సంగతి చెప్పమని ఆడిపెళ్లాఁ వొచ్చి ఆగోరిస్తోందండి.

రఘు :- ఏమీ, యిప్పుడు పోలీసువారిచే నీడ్చుకొని పోఁబడుచున్న వాఁడు రంగఁడా! ఇటువంటి విషయములో మా నవుకర్లకు మేము సాయపడువారము కా మని చెప్పుము!

చిన్న :- చిత్తం బాబూ! చిత్తం. ఇదే మా పటాలంలో అయితే యీపాటికి చీకటికొట్లో యేశా రన్నమాటే. తెల్లోడు తాను తాగడఁవేకాని, యెదటివాడు తాగడాని కెన్నడూ వొప్పకోడు.

రఘు...సరే, నీసోదె చాలుఁగాని, వీలుగా నున్నయెడల నొకసారి పయికి రమ్మన్నా నని విశ్వాసరావుగారితోఁ జెప్పి, క్రొత్తగుఱ్ఱమునకు జీనుగట్టి కొని తెమ్మని గుఱ్ఱపువానికి వర్తమానమంపుము.

చిన్న...చిత్తం బాబూ! చిత్తం (అని నిష్క్రమించును.)

విశ్వా....(ప్రవేశించును)

రఘు...మామగారూ! రంగని సంగతి విన్నారా?

విశ్వా....విన్నాను బాబూ! విన్నాను.

రఘు...తోడనే వీనిని కొలువునుండి తొలఁగించుట మంచిది కాదా?

విశ్వా....మంచిదే కాని, యొకసారి మందలించి చూతము.

రఘు...ఏమి వెఱ్ఱి! గుగ్గిళ్ళు పెట్టిన గూనివంపు తీఱునా?

ఆ. దూదిబుంగ నరుఁడు, దుర్వ్యసనంబులు
నివుఱు లేని చింత నిప్పు రవలు
స్పర్శమునకు దాకి సంఘటిల్లిన నంతు
చూడకుండ పీడనాడు టేడ!

ఆపయిని...

గీ. అంటురోగంబులకును, దుర్వ్యసనములకు
లేదు పరికింప భేదము లేశమేని;
దరికి రానిత్తు మేని, తథ్యముగ ప్లేగు
పోలిక, క్షణంబులోఁ జుట్టుముట్టి తీఱు!

విశ్వా....నిజమే నిజమే. కావుననే, దుర్వ్యసనములకును మనకును దూర మెంతయున్న నంతమంచి దని పెద్దలు చెప్పుదురు. తమ సెలవు ప్రకార మీరంగని తత్ క్షణమే తొలఁగించెదను.

రఘు...(నవ్వుచు) సరి కాని, మామగారు! సాహసించి యడుగు చున్నాను. మీ కేమియు దుర్వ్యసనములు లేవు కద?

విశ్వా...ఈశ్వరానుగ్రహమువల్ల నింతవఱకు లేవు!

రఘు...ఆఁ! మామగా రిప్పుడు నా చేతిలో మత్స్యము గాలమునఁ జిక్కినట్లు చిక్కినారు! మీకు నస్యవ్యసనము లేదా?

సీ. నస్యంబు దృష్టిని నాశంబు గావించు
పొగచుట్ట పెదవుల పొలుపుఁ జెఱచు
బీడీలు జిహ్వా క్రియ మాచరించును
సిగరెట్టు గుండెను శిథిలపఱచు
మద్దతు బుద్ధికి మాంద్యంబు కలిగించు
గంజాయి పిచ్చిని గలుగఁజేయు
కాఫీ నరంబుల కాపత్తుఁ గలిగించు
టీ పైత్యవృద్ధి ఘటిల్లఁ జేయు
మాదుము వివేక మెల్లను మంటఁ గలుపు
భంగు జ్ఞాపకశక్తిని భంగపఱచు
అభిని రక్తమాంసంబుల నార్చివేయుఁ
గాంచ' దుర్వ్యసనంబులు కావె యివ్వి?

విశ్వా....నస్య మంతకూడదని దని నా కెన్నఁడుఁ దోఁచ లేదు.

రఘు....ఆలాగుననా! అట్లయిన నాలకింపుడు....

సీ. ఎంతటివానిచే నేమియు బిడియంబు
వెడలించి, చేయి చాపించి తీఱు!

విశ్వా...ఆ మాట నిజమే. వెలమదొరగారు కూడ పొడుము ముష్టికి
వెనుక తీయరు!

రఘు...తఱచుగా నేదనో దాఁకొని వెట్టి యె
త్తించి తైతక్క లాడించి తీఱు!

విశ్వా...ఏదనో కాదు, ఎదుటను నుండియే కంటి కగపడదు!

రఘు...ముందుగాఁ దన్నెత్తి మూర్కొనకున్నఁ, జే
యఁగఁబూను పని కడ్డు తగిలి తీఱు!

విశ్వా...సందియ మేమి, భోజనసమయమునఁగూడ పొడుము పీల్చినఁ
గాని కథ నడువనివారు కావలసినంతమంది!

రఘు....ముక్కును ముఱుగు తూముగఁ జేసి, దేవుని
తిన్నెపైనైన చీదించి తీఱు!

విశ్వా...దేవుని తిన్నె మీఁదనే కాదు-దేవునితలపై గూడ నాయూ

టతో నప్పుడప్పు డభిషేకము జరుగుచునే యుండును!

రఘు...ఊటమరకలతో మేని యుడుపులెల్ల
చించి-చాకలిచేత దిట్టించి తీఱు!

విశ్వా...చాకలి చేతనేగాదు—వాకిలి యూడ్చు దాసీదానిచేఁగూడ చావుతిట్లు తినవలసినదే!

రఘు...పలుపలుకు లేల-వెలయాలుపగిది—నెత్తి
నెక్కి, కట్టు కుండల చేతి కిచ్చితీఱు!

విశ్వా...నిజమే బాబూ! -నిజమే! ఇదిగో-నా పొడుము బుఱ్ఱ నిప్పుడే పప్పుక్రింద కొట్టెద! (అని యట్లు చేయును).

రఘు...సెబాసు! నాజన్మ మిపుడు చరితార్థమైనది! ఏమా?
ఏటవాలుగఁ బాఱెడి యేటినుండి
వ్రణమువలె సల్పు తలమించు బుణమునుండి
నాటుకొనినట్టి దుర్వ్యసనముల నుండి.
యొకనిఁ గాపాడినను జన్మ మొప్పు నంద్రడు.

చిన్న...(ప్రవేశించి) బాబూ, గుఱ్ఱఁ వొచ్చిం దండి.

రఘు....మామగారు!నే నొకసారి మన తోట వఱకుఁ బోయి వచ్చెద. ఈపూట వచ్చిన యుత్తరము లివిగో, యిచ్చట నున్నవి (అని బల్లమీఁది యుత్తరములు చూపి, బట్టలు వేసికొని చిన్నయ్యతో నిష్క్రమించును.)

విశ్వా...(ఉత్తరములం దీసికొనుచు) అవురా! అబ్బాయిగారి యోగ్యత! ప్రభువు లందఱు నిట్టి వారైనచోఁ బ్రజల భాగ్యమెట్లుండెడిదో గదా!

సీ. కోళ్ళతో, గొఱ్ఱెపొటేళ్ళతో, సీమ కుం
దేళ్ళతోఁ గొలువులు తీఱువారు!
వేలును లక్షలు వెచ్చించి, కుక్కలఁ
గొని మూతి నాకించుకొనెడివారు!
ఇంటి దాసీలకు బంటులై, భార్యల
మోము లన్న మొగాలు ముడుచువారు!

పాడు వేసాలకై బ్రాంది సీసాలకై
యేస్టేట్లనే విక్రయించువారు!

నై, జమీందారు లెందఱో నైజకీర్తి
గంగలోఁ గల్పుచున్న యిక్కాలమందు—
భాగ్యవశమునఁ గాక, యిప్పగిది పరమ
పావనుండైన ప్రభువు సంప్రాప్త మగునె!

చిన్న...(వడిగాఁ బ్రవేశించి) అయ్యా! అయ్యా!- రండి!-రండి!-రండి!
పాడుగుఱ్ఱం బెదరి బాబుగార్ని పడదోసిం దంట!

విశ్వా...(ఉలికిపడి) అరెరే! యెంతపని జరిగినది! అబ్బాయిగారి
కేమియు దెబ్బ తగుల లేదు గద?

చిన్న...అమ్మయ్యో! అంతగుఱ్ఱం మీదనుంచి పడితే దెబ్బే తగల్దా?
తల పగిలిం దంట, తరువేసి ఆసుపత్రికి తీసుకు పోతున్నారంట!
పోలీసువారు జామీను తీసుకపొమ్మంటే, ఆసఁవయానికి రంగ
డెల్లాగో అదారి నొస్తున్నాదంట, పాపం. బాబుగార్ని వాడే
పట్టి లేవనెత్తాదంట!

విశ్వా...(ఆందోళనముతో! అన్నన్నా! యెంత ప్రమాద మెంత
ప్రమాదము! దైవమా! నీ వింత దారుణమున కొడిగట్టితివేమి!

ఆ. సకలసుగుణరాశి, శాంతి, పయోరాశి
వినయ భరతుఁ, దతివివేకకలితుఁ;
డట్టివాని కిట్టి యాపద కలిగింప
బుద్ధి యెట్లు నీకుఁబుట్టె నయ్య!

(అనుచు సత్వరముగా నిష్క్రమించుచు.)

(ఇది ప్రథమాంకము.)

## ద్వితీయాంకము

# మొదటి రంగము

ప్రదేశము : రాజవీథి.

రంగడు....(గొడుగు చేతఁ బట్టుకొని ప్రవేశించి)

పాట

(1) సారా కల్లూ సల్లగ వుంటే - రొక్కం డబ్బులు రొంటిని వుంటే
లోకుల్తో నా కేవి పని!, యీ లోకంతో నా కేఁవి పని!

(2) కాలవ లన్నీ కల్లే అయితే – సఁవుద్ర వంతా సారా అయితే
కలువొస్తే నా కేఁవి బయం! కాటకఁ వొస్తే యేఁవి బయం!

(3) సారా సీసా సంక నుండగా, సేతను గుప్పెడు సీకు లుండగా
హాయిగ పేణం పోవాలి, అప్పుడు సొర్గం రావాలి!

సందేయఁ వేఁవి? సారా తాగినాడో సరసుడు; కల్లు తాగి నోడే ఘనుడు. కాదన్నవాడు నా కాలిగోరు మీదనుంచి బలాదూరు! అయితే, వోటిమాత్తరం నిజం : తాగేవాళ్ళ అదురుష్టంవంతా తాటిసారాతోటే పోయింది. అందులోనూ సిగురుసారా పోవడం, సిరి పోవడఁవే! ఆ మాఁవిడిసిగురు రంగూ— ఆ సకల సంపెంగ వోసనా, ఆ అగ్గినిప్పు నిషా, వో! వో! గ్యాపకఁ వొస్తే, వొళ్ళు గరిపొడుస్తుంది! పాడు రమ్ము, ఈ రమ్మొచ్చి, రొమ్ములు తినేస్తోంది! అయిదు బుడ్లు తాగినా, అగ్గిపుల్ల మంటలాగ, అంతలో సెల్లు! సాట్లోళ్ళు తాళ్ళకు నెంబర్లెయ్యడఁ వొచ్చాక, కల్లుకూడా కంగాళీ అయిపోయింది. కల్లు తాగితే మునుపు, కవిలాసంలో వున్నట్టుండేది! ఇప్పుడు కల్లు తాగితే కళ్ళు తిరగటం, వొళ్ళుపెరగడం, పళ్ళు విరగడం తప్ప, పై నేమీ లేదు! కల్లు సఁవుద్రం యెక్కడుందో కనపర్చిందాకా, బేపనోళ్ళను పట్టుకొని, బేపు ల్నాకేలాగు తన్నే బేసుగ్గా వుండేది! (పరిక్రమించి) నేను రంగఁ పెళ్ళి, ముడుపులమ్మ తీర్తానికి మూడేళ్ళు. ఈ మూడేళ్ళల్లోనూ ఊరంతా ముక్కలూ, సెక్కలూ అయింది. బ్రాంది షాపులు పలచబడ్డాయి, సారాకొట్లు సగఁవైనాయి

కల్లు దుకాణాలు కనబడకుండానే పోయాయి! కాఫీ హోటేళ్ళు మాత్తరం కావాల్సినన్ని లేచాయి! కాని కల్లు కావలిస్తే కాసీ యెల్లిన ట్టెల్లాలి! ఈ దుకాణాలు దూరంగా తరివేసినోణ్ణి, పడదీసి తన్నినా పాపంలేదు! వోయి రంగ! వోయిరంగా! నా సేతినిండా డబ్బేవుంటే, కాసీ రామేశ్వరాల్దాకా కల్లు సలివేందర్లు పెట్టించక పోయ్యానా! డబ్బున్నా వోళ్ళ కొక్కళ్ళకి తల్లో వూకన్నమాట లేదు. (ముందునకుఁ జూచి) అడుగో సిపాయి సిన్నయ్యతాత! (పరిక్రమించి) ఏం సిన్నయ్యతాతా! యెల్లా వున్నావు?

చిన్న....(ప్రవేశించి) అదిగో, రంగ డెప్పుడో రంగన్నుంచి దిగాడే?

రంగ....మొన్నటి వోడలో వొచ్చాను తాతా!

చిన్న....ఎన్నాళ్ళ కొచ్చావు! ఏఁవిటి రంగఁ విసేషాలు?

రంగ....అబ్బో! రంగం సంగతి సెప్పడానికి నాతరఁవా, నా యబ్బ తరఁవా! ఎవణ్ణిసూసినా, సేతినిండా డబ్బు, కడుపునిండా సారా! పెతియీదిని బ్రాంది షాపు, సందుసందుకూ సారాకొట్టు! బ్రాంది సారాలు తాగితే బర్మావోడే తాగాలి; అయితే, రమ్ము సారా వొచ్చాక, రంగాన్ని కూడా షోకు తగ్గిందఁట.

చిన్న...మేఁ వెళ్ళిన్నాటికి ర మ్మింకా రాలేదు.

రంగ...ఏఁవిటీ! అయితే నువ్వు రంగం సూశా వన్నమాటే!

చిన్న...వొక్క రంగఁవేనా?, రంగం, మోరీను, టోకీ, సింగపూరు, మాండలే, వొకటేఁవిటి, ఆ టాపంతా సుట్టబెట్టాం. అసలు ఆవా రాజును పట్టుకున్న దెవరు? మేఁవు కాదూ? అప్పుడేగా ఆకాశా న్నుంచి సుక్కలు రాలాయి! మా పటాలఁ వెళ్ళకపోతే మాండ లీకోట దొరికేదా! ఆ రాజు సింహాసనాన్ని అరు వొందల వజ్జిరా లున్నాయి! కోటలో యెటు తిరిగినా కోడి గుడ్డంతేసి రత్తనాలు కాళ్ళకు తగలేవి!

రంగ...రత్తనాలేనా! రమ్ముసారా యేఁమైనా వుండేదా?

చిన్న...రమ్మింకా రాలేదన్నగా? ఇట్టఁ వొచ్చినంత యిప్పసారా, పట్ట సారా దొరికాయి.

రంగ...అయితే నువ్వు సేనాసారాలు సూశా వన్నమాట!

చిన్న...సూశాను గానీ, 'పాఁవుమంతరం నేర్చుకున్నాక, పత్తిరిసేవ మొదలెట్టి, కల్లు సారాలు కంట సూట్టం మానేశాను.

రంగ....సరేగానీ బాబుగా రెల్లా వున్నారు?

చిన్న....బాబుగారు బంగారంఁలా గున్నాడు. అన్నట్టు సెప్పలేదు! బాబుగారు పడ్డప్పుడు నువ్వుసేసిన సేపకు, బగుమతి యివ్వడానికి పిలవమంటే, నువ్వు రంగఁ వెళ్ళినట్లు నేనే సెప్పాను. అప్పట్లో నువ్వుంటే అడిగిన యీనాఁ విచ్చేవారు. నిజంగా బాబుగారప్పుడు నీమూలాన్ని బతికారు!

రంగ...తప్పు తప్పు. నామూలాన్ని కాదు, సఁవయానికి నా చేతులో వున్న సారా సుక్క మూలాన్ని బతికారు! ఆ పడ్డపాటుకే ఆ సుక్క పడకపోతే, ఆపాట్న గుటుక్కు మనవలసిందే!

చిన్న...అయితే బాబు!, అయ్యగా ర్నికాడికి తెచ్చింది నీ సేతి బోణీ యేనా!

రంగ...అదేం టదేంటి? ఏకాడికి తెచ్చిందేంటి?

చిన్న...ఏకాడికా, (మెల్లగా) తాగినోడంటే తరిఁవేశేకాణ్ణుంచి తాగు మోతుల్ని సూట్టూ కూకుండబెట్టుకుని, తప్పతాగేకాడికి! కాఁవోసినంత సొమ్ముతో కలకల్లాడేకాణ్ణుంచి, అరవయ్యేల్దాకా అప్పుసేసే కాడికి! ఈపాలి తెలిసిందా?

రంగ...(ఆశ్చర్యంతో) నిజంగానే?

చిన్న....అమ్మతోడు! ఆమారాజుమీద నే నబద్ధఁ వాడతానా!

రంగ...అవు నవును! అందు కాచ్చేరిఁ వేవుంది! నామట్టుకు నా కెలా తగుకుందో తెల్సునా? మాబాబుదినానికి, మాసొతాని జియ్యాన్న సచ్చినోడు కానికాని పుచ్చుకొని కాస్తకాస్త సేతులో పోశాడు! ఆ కాని దబ్బు నీళ్ళతోనూ,కాఁవారపు జీడిలాగు పట్టుకుంది. అయితే, బాబుగారికి కార్జఁవయిందా?

చిన్న...కాఁవోసినంత బలవంతంమీద నియడు కార్జమాత్తరం జరిగింది.

అయెనక, అమ్మగార్నారు పంపాలేదు, యీరు తీసుకొని రాలేదు. అయితే, రంగాన్నుంచి అప్పుడే వొశ్చాశావేం?

రంగ...అబ్బో ఆ గొడవ సేనావుంది. వోబర్మావోడికీ, నాకూ సారా కొట్టులో జగడం పెరిగి శాకుతో పొడిసాను. అందుచేత పోలీ సోళ్ళ కందకుండా అమాంతంగా సక్కా రావలసొచ్చింది.

చిన్న...అల్లాగయితే నీ సేతితొంద రింకా అణగలే దన్నమాటే! ఏం తెచ్చావు రంగాన్నుంచి?

రంగ...రంగాన్ని గడిచిం దంతా రమ్ముసిళ్ళకే పోయింది. వో పెట్టీ, పట్టురువాలూ, ఈ గొడుగూ, పదిరూపాయలు రొక్కం మాత్తరం తెచ్చాను. పదిరూపాయలూ వచ్చిన్నాడే పయిస లయ్యాయి. మొన్న పెట్టమ్మాను, నిన్న రువాలమ్మాను, యీపూట ఈగొడు గట్టుకు బయదెల్లాను.

చిన్న....సరే, సరే, అడుగో సెర్మగా డొస్తున్నాడు! ఆడికంట పడితే యేదో పని సెప్పకమానడు. ఆన కింటి కొస్తాను పద.

రంగ...సెరమగా డెవడు?

చిన్న....బాబు గారికి దాపరించిన బాటిల్ మేష్టర్లలో వొకడు! తక్కాన మాటలు తరువాత సెబుతాలే!

(ఇద్దరు నిష్క్రమింతురు.)

# రెండవ రంగము

ప్రదేశము....రఘునాథరావుగారి మేడమీది గది.

ప్రవేశము...బ్రాందిసీసాలును, గ్లాసులును గల బల్లకుఁ జేరియొకవైపున గూర్చుండి....రఘునాథరావుగారు, శర్మ.

రఘు...సరికాని, యొక సందేహము...

చ. మనసు లటాలున న్మెరపు మాదిరి దీప్తి వహించు; బుద్ధి య
య్యినకిరణంబులం గమల పెట్టులో యట్లె వికాస మొందుఁ జ
య్యన నిఖిలాంగకంబులును యంత్రమునం ఘటియించినట్లు క్రా
లును, మధుసేవ యేటి కిలలోను నిషేధ మొనర్చిరో బుధుల్!

శర్మ...ఈడౌటు (Doubt)నే నిట్టే క్లియరాఫ్(Clear off) చేసెదను గాని, ఇంకొకగ్లాసు కానిండు.

రఘు...(నవ్వి) దానిడౌట్ దానిచేతనే కాని తీఱదు కావలయును!

ఇద్దఱు...(బ్రాందితో గ్లాసులు నింపి, పానము చేయుదురు)

రఘు....దీనితో నీ వెన్నిగ్లాసులు ?

శర్మ....ఎన్నియో యెక్కడ?, అన్నియుఁ గలిసి యైదేగా! మీరో?

రఘు...నేను మూడే కాని, నా కప్పుడే ముచ్చెమటలు పట్టుచున్నవి! ఏమి చిత్రమో కాని, యెన్నిగ్లాసులు పడినను నీ వేమియుఁ జలింపనే చలింపవోయి!

శర్మ....అదిగో అదియే మనయొద్ద నున్న యతిశయము.

ఉ. త్రాగుట గొప్పకాదు, పదిద్రాములు ద్రాగిన మూలమూలలన్
దాఁగక, డీలువోక, వస త్రాగిన పిట్టవిధాన వెఱ్ఱిగా
వాఁగక, యొద్దకుం జనిన వాసన గొట్టఁగ నీక, వీధులన్
దోఁగక; పెంటకుప్పలను దోరక యొప్పుటె గొప్ప నా దగున్.

రఘు...సరే కాని, నా సందేహము తీర్చినావు కావు.

శర్మ...బాబూ! మన పెద్దల తెలివితేటలు మనకుఁ బూర్తిగాఁ దెలిసిన తరువాతఁ గూడ మన కీ సందేహ మెందులకు?

చ. దినకరుఁ డంబరస్థలిని దేరిపయిం జను నన్నవారు; భ
వ్యనరుహజాంధవాసుల నవారిగ సర్పము మ్రింగు నన్నవా;
రనువుగ సప్తవార్ధులకు హద్దులు చెప్పినవారు మద్య మం
టిన దురితం బటంచుఁ బ్రకటించుటలో విపరీత మున్నదే!

రఘు...నాన్సెన్సు (Nonsense). నా కామాట నచ్చలేదు.

ఉ. మానమునందు, శాస్త్రపరిమాణమునందు, వివేకమందు, వి
జ్ఞానమునందు, నాగరిక సంపదయందుఁ, గళారహస్య సం
ధానమునం దశేష వసుధాస్థలికి న్మనదేశమే గురు
స్థాన మటంచుఁ దేలె! సురసంగతియే మనవా రెఱుంగ రే?

శర్మ...అట్లయిన నొకటి కావలెను. అట్టిభయమే పెట్టకపోయినచో, నందఱు నదే మరగి, మనవంటివారి కందకుండఁ జేయుదు రని యట్లు నిషేధించియుందురు. అయినను, మనవారేమన్న నేమి, అనుభవజ్ఞులైన యింగిలీషువారన్నమాట యిది.

* హీ మస్టుడ్రింకు విస్కీ ఆఫ్ దీ స్ట్రాంగెస్టు కైండు
టూ స్టెడీ హీజ్ నర్వ్ అండు స్ట్రెంగ్తెన్ హిజ్ మైండు.

రఘు...సరె కాని, ఆదిలో నీ కీ యంటురోగ మెట్లు సంప్రాప్తమైనది?

శర్మ—అబ్బో!, ఆ గ్రంథము, అరేబియన్ నైట్సంత యున్నది. మఱియొకగ్లాసు వేసికొని పనవి చేసెదను. (అని యట్లుచేసి) నేను స్కూలులోఁ జదువుకొనుచుండగా, మా టీచరుగా రొకసారి మాచేత నొక నాటక మాడించినారు. అంతట, నాదృష్టి చదువుమీఁదినుండి, సరాసరి నాటకములమీదికి నడిచినది. ఆపాటున మాయూరునందలి ఆంధ్రయువజన సంతోష సంగీత సరస్వతీ హిందూనాటక సమాజ సంఘ సభలోఁ జేరినాను. నాటకసంఘముయొక్క నామమునకుఁ గాఁబోలు నవ్వుచున్నారు! ఇప్పటిపేరు లింకను నమడగొయ్యి, గత్తర బిత్తర, కొకి బికి కొల్లేటి చేంద్రాడులుగా!

* He must drink Whisky of the strongest kind
To steady his nerve and strengthen his mind.

రఘు...కాదన్నవా రెవరు?, నీకథ కానిమ్ము. అందుఁ జేరినావు.

శర్మ....చేరఁగానే, సంఘమువారు నా సరదా చూచి, నూనూగు మీసము నున్నఁగాగొరిగించి, చిన్న చిన్న స్త్రీ వేషములు వేయించుటకు మొదలు పెట్టినారు. కాని—యేమిలాభము ? గంపెడు సిగ్గు! పెండ్లికూతురివలె రంగ-స్థలమున కరిగి, పేడకుప్పవలెఁ జతికిలఁ దడెడివాఁడను! సభ్యులవంకఁగన్నెత్తి చూచితినా, చలి జ్వరము వచ్చినంత వడంకు! మా మేనేజరు మంచి బాటిల్ మాష్టరు! ఆ దినములలో నే నాయనదిన చర్యలను గూర్చి యల్లిన పద్యము చదువనా?—

సీ. మార్నింగు (Morning) కాఁగానె మంచము లీవింగు (Leaving)
మొగము వాషింగు (Washing) చక్కఁగ సిటింగు (Sitting)
కార్కు (Cork) రిమూవింగు (Removing) గ్లాసులు ఫిల్లింగు (Filling)
గడగడ డ్రింకింగు (Drinking) గ్రంబులింగు (Grumbling)
భార్యతో ఫైటింగు (Fighting) బయటికి మార్చింగు (Marching)
క్లబ్బును రీచింగు (Reaching) గాంబులింగు (Gambling)
విత్తము లూసింగు (Losing) చిత్తము రేవింగు (Raving)
వెంటనే డ్రింకింగు (Drinking) వేవరింగు (Wavering)
మరల మరల రిపీటింగు (Repeating) మట్టరింగు (Muttering)
బసకు స్టార్టింగు (Starting) జేబులు ప్లండరింగు (Plundering)
దారిపొడుగున డాన్సింగు (Dancing) థండరింగు (Thundering)
సారెసారెకు రోలింగు (Rolling) స్లంబరింగు (Slumbering)

రఘు....(పకపక నవ్వి) ఓరీ నీపద్యము కాల! ప్రాణములు తీసినావు?

శర్మ....ప్రతిరోగమునకు బ్రాందిచుక్క పరమౌషథ మన యాయన సిద్ధాంతము. ఆసిద్ధాంతము ననుసరించి యొకనాఁ డాయన నా రోగమున కొక యవున్సు బ్రాందిని త్రాగించెను. ఆ పూఁట నా యాట నిప్పు త్రొక్కినకోతిని నీవా నేనా యనునట్లు నడచినది!

అందువల్ల, నాఁడు మొదలు నా కది మందైనది. ఆయన చుక్క హెచ్చినకొలది నాచుఱుకుదనము హెచ్చినది. నాచురుకుదనము హెచ్చిన కొలఁది యాయనచుక్కయు హెచ్చినది. అనా డావిధముగా నాయన పెట్టిన బిచ్చ మవిచ్ఛిన్నముగ నేఁటికిని సాగుచున్నది! నాకథ యిది. దయచేసి, మీ కథ కూడఁ దెలిపితిరావిని యానందించెదను. మీ రుపక్రమించులోపలనొకసారి మరల నోరు తడుపు కొనెద. (అని మరల నొకగ్లాసు త్రాగును.)

రఘు...నాకథ నాకే వింతగాఁ దోచునంత విచిత్రమైనది! మొన్న మొన్నటివఱకును, మద్యపానమును నాకంటె నిరసించువారు మనయిండియాలో లేరు! అట్టి స్థితిలో, నొకనాఁడు నేనొకక్రొత్త గుఱ్ఱమునెక్కి షికారుపోవుటయు నొకచోట నది బెదరి బెగ్గోలు పడుటయు నేను దత్తరిల్లి తలక్రిందగుటయు, తల పగులుటయుఁ దటస్థించినది. అపూటనే, త్రాగినందులకై నాచే గొలువునుండితొలగింపఁబడి, దైవయోగమున, నాసమయమున నాచేరువకు వచ్చియున్న నాపరిచారకు డొకఁడు నాపాటు చూచి, చప్పునఁదనకడనున్న సారాయి యింత నోటఁబోసెను! అమ్మగతలోఁ గిమ్మనకుండ నాచుక్కలు మ్రింగితిని! అప్పుడెఱిఁగిన దంతవఱకే. మఱునాడు మధ్యాహ్నమునకు మరలఁ దెలివి వచ్చినది. కాని, తాళవశముకాని తలపోటు! డాక్టరు నాబాధ చూచి, గ్లాసుతో నింత యరఖు తెచ్చి పోసెను. దానిచే మరల మైమఱచి నిద్రించితిని. కాని మెలకువ రాఁగానే తలపోటు మరల దాపుర మైనది! మరల డాక్టరు మందు తెచ్చి పోసెను. ఈ విధముగాఁ దెలివి వెంబడినె తలపోటు...తలపోటు వెంబడినె డాక్టరు గారి పరమౌషధము!

శర్మ....సరే, సంగతి బోధపడినది. అపరమౌషధము బ్రాండి!

రఘు....యూ ఆర్ రైట్! (Yor are riht) కానియాసంగతి నాకప్పటికి తెలియదు. గాయముమానినపిమ్మటఁగూడ గ్రహచారపుఁదలపోటు మానకపోఁగా, డాక్టరు తా నిచ్చుచువచ్చిన యర

ఖిది యని తెలిపి-బాధానివృత్తి యగువఱకును ద్రాందిసేవ
తప్పదని చెప్పెను! ఇంకఁ జేయవలసిన దేమున్నది?-

చ. పదిలముగా గవాటమును వైచి, యొకండనె కూరుచుండి యీ
గది నొక కొన్నినాళ్ళు-నిటఁగాదని మా వనవాటి కేగి పూ
బొదలను గొన్నినాళ్ళు-నిరుపూఁటల మందుగఁ గ్రోలి క్రోలి,హా!
తుద కిటు రేపు మాపులను దుష్టిగఁ ద్రాగెడుదాఁక వచ్చితిన్!

శర...ఇంకఁ జెప్పనక్కఱలేదు. ప్రపంచమునందలి పైతరగతి త్రాగు
బోతులలో-వందకుఁదొంబదిమంది వైద్యులవల్ల వక్రించినవారే!

గీ. తథ్యము వచింతు-మద్యసుందరికి గన్న
తండ్రి వైద్యుఁడు; వెలయాలు తల్లి; వైష్ణ
వుండు చెలికాఁడు; తద్వర్తకుండు దూత;
జారులుం, జోరులు, నిశాచరులు, మంత్ర
వాదులుం, జూదరులు, నటుల్ వలపుమగలు!

రఘు...అయినను, నేనాయన చెప్పగానే మెత్తబడలేదు. అనేక
సాధనములు చేసి చూచినాను. కాని, దానితోఁగాని తలపోటు
తగ్గెడిదేకాదు! చివరకొక సంవత్సరమున కాశిరోవేదనపోయినది.
అయిననేమి అప్పటికి యది వెన్నెముకవఱకును వేరుతన్నినది!

శర్మ...(తనలో) కనుకనే, మావంటి వాండ్ర కింత గ్రాసము దొరకు
చున్నది! (పయికి) అయిన, సందులకూ మీరన్యథా భావింప
నవసరము లేదు.

* ఏ లిటిల్ విస్కీ, నౌ అండ్ దెన్,
యీజ్ రెలిష్డు బై ది బెస్టు ఆఫ్ మెన్.
అని కారికలే యున్నవి. అది కాక-మీరు గుఱ్ఱము మీది నుండి
పడినప్పుడు మీ సేవకుడు పోసిన చుక్కలే మీ ప్రాణములను
నిలిపినవి. కాకున్నఁదోడనే కాళ్ళు సేతులు చల్లబడెడివి. మద్యము
యొక్క మహిమకు మేర యున్నదా!

---

* **A little whisky, now and then, is relished by the best of men.**

సీ. కసుగందువాఁడొక గ్లాసు వేసినతోనె
హనుమంతునకు గంతులాట నేర్పు
మూగవాఁ డొక్క డ్రాముం గొన్న మాత్రాన
వేనోళ్ళ శేషుని నెక్కిరించు
పిఱికివాఁ డొక యౌన్సు పీల్చినయంతనే
యుత్తరు చెంపపై నూఁచికొట్టు
పుంస్త్వహీనుం డొక పుడిసెడు గొనఁగానె
సింహబలుం బట్టి చిత్తుచేయు
పరమలోభి యొక్క పాత్రెడు సేవింప
దానకర్ణుఁ దరిమి తరిమి కొట్టు
శోకభరితుఁ డొక్క సోలెండు గ్రోలిన
నొదలు మఱచి హర్షజలధి మునుఁగు!

రఘు....(నవ్వి) ఇదిగో-యీ సీధోరణియే యిందులకు నిదర్శనము!

శర్మ...నా మాటలు మీ రట్లు నవ్వులఁ బుచ్చఁదగినవి కావు. జగత్ప్రఖ్యాతి వడసిన - షేక్స్పియర్ త్రాగుబోతు, షెరిడెన్ త్రాగుబోతు; పిల్సన్ త్రాగుబోతు, నెల్సన్ త్రాగుబోతు; మనలో వ్యాసుడు త్రాగుబోతు, వాల్మీకి త్రాగుబోతు; కాళిదాసు త్రాగుబోతు; కబీరుదాసు త్రాగుబోతు; ముప్పదిమూడుకోట్ల దేవతలు త్రాగుబోతులు, మును లందఱు త్రాగుబోతులు. ఇప్పటి నాగరక ప్రపంచములో త్రాగనివానికి తావే లేదు! త్రాగినవాఁడేయూరికితలమానికము - త్రాగినవాఁడే నలుగురిలో తగవరి! త్రాగినవానికే యూరిలో దాక్షిణ్యము - త్రాగినవానికే యింటిలో ధర్మపిండము! త్రాగినవానికే సభలో తాంబూలము- త్రాగినవానికే మేజువాణీలో దండము! ప్రభువు త్రాగక పాలింపలేఁడు. సేవకుఁడు త్రాగక సేవింపలేడు! వకీలు త్రాగక వాక్కు మెదపలేడు. వైద్యుఁడు త్రాగక వ్యాధినిగని పెట్టలేఁడు. కవి త్రాగక కలముపట్టలేఁడు-గాయకుఁడు త్రాగక కంఠమెత్తలేఁడు! పూజారి త్రాగక పులికాపు పెట్టలేడు-అర్చకుడు త్రాగక

హారతి పట్టలేదు! వంటవాడు త్రాగక వుండలేఁడు-వడ్డనవాడు త్రాగక వడ్డింపలేడు! పెండ్లిలో త్రాగుడు, పేరంటములో త్రాగుడు, విందులో త్రాగుడు, వీడుకోలుపులో త్రాగుడు, క్లబ్బులో త్రాగుడు, గ్రంథకుటిలో త్రాగుడు, రచ్చలో త్రాగుడు, రైలులో త్రాగుడు, భోగములో త్రాగుడు, రోగములో త్రాగుడు, చావులో త్రాగుడు, శ్రాద్ధములో త్రాగుడు! ఈ విధముగా త్రాగుడు; ఇష్టదైవమువలె నిహపర సాధనమై-పడఁగు పేకలవలె ప్రపంచమంతయు నిండి-గాలి వెలుగులవలె గౌరవాదరములను బడసినది. పడయుచున్నది, పడయ నున్నది!

రఘు...(పకపకనవ్వి) ఓరి నీ లెక్చరు కాల! టెంపరెన్సు సొసైటీ వారి (Temperance Society) దుంప తెంపెడునట్లున్నావే! సరికాని, ఈ దుర్వ్యసనమున కిందఱులోనగుటకుఁగారణమేమి?

శర్మ...దాని మహిమయే దానికిఁగారణము. ఆ మహిమ కంతున్నదా!

సీ. బ్రాందిసీసా కంటఁబడఁగానె వరహాల
పాతు దొఱ్ఱించినపగిదిఁ దోఁచు!
కప్పు మంచును గార్కు చప్పుడైనంతనె
జయభేరి విన్నంత సంబ్రమొదవు!
దొడదొడ గ్లాసులోఁ దొలికించు సమయాన
నమృతంబు పడుచున్న యట్టు లుండు!
చుఱచుఱ గొంతులోఁ జొచ్చెడు తఱి, పోయి
నట్టిప్రాణము వచ్చినట్టు లొప్పు!
అవల, నానందవార్ధి నోలాడునట్లు
స్వర్గభూమి విహారము సలుపునట్లు
రంభ యొడిలోన నిద్దుర గ్రమ్మినట్లు
తన్మయావస్థలోనఁ జిత్తము సుఖించు!

రఘు...అసహాయవాదులు దాని నంత మొందింపఁజూచుచున్నారే.

శర్మ...అసహాయవాదులు కారు సరిగదా-హరిహరాదులు కూడ దాని నంత మొందింప లేరు! ఏమందురా? -వారి నడ్డుకొనఁగల

మహానుభావులు వైశ్రాయి సభలోఁగూడఁ గలరు! అపైని ఎలక్షనులో దాని కిప్పు డెక్కడలేని ప్రాముఖ్యతయుఁ గలిగినది! విన్నారో లేదో మొన్నటి మ్యూనిసిపల్ యెలెక్షను సందర్భమున-సారాకొట్లు, మ్యూనిసిపల్ కచేరీల మధ్య—వోటర్లు తిరుపతి మ్రొక్కుల బిచ్చగాండ్రవలె తీట తీఱ దొరలినారఁట! దీనికేమిగాని-క్లబ్బులో గానసభ యఁట-వెళ్ళుదమా?

రఘు...చీట్లాట గుంపులో మన క్లబ్బు-శివలింగ తిరునాళ్ళను మించియుండును గదా-ఆ గందరగోళములో గానసభ కూడానా!

శర్మ...అసలు, మీకు, సంగీతమునందుఁజవి కలదా?

రఘు....సంగీతమునందుఁజవి లేకపోలేదుగాని—

చ. బిరడలు త్రిప్పి, తంత్రులను బెట్టునత్రెంచి, ముడుల్గటించి, తంబుర శ్రుతిచేసి, గొంతుకఫమున్ సకిలింపుల నెట్టి, గూబపై కరము గదించి, వాతపౌరి క్రమ్మిన చందమున న్వికారవైఖరి సభలోన గింజుకొను గాయకుఁడన్న నసహ్యామే జుమా!

శర్మ...అట్లయిన మీ కాఁడుపాటపై నాదరము హెచ్చన్నమాట!

రఘు....ఆఁడుపాట యన్న జ్ఞప్తికి వచ్చినది. మొన్నరాత్రి యీ వీధినొక పెండ్లియూరేగింపు వెళ్ళినది. ఆ యూరేగింపుమేజువాణీలో నొకతె పాడినది గదా, ఆ స్వరమాధుర్య మేమని చెప్పుదును!

శర్మ...స్వరమాధుర్యమేనా-దాని సౌందర్యమాధుర్యము కూడఁ జిత్తగించినారా?

రఘు....అంతవఱకు జరుగుట కవకాశము లేకపోయినది.

శర్మ...(తనలో) సెబాసు! అసలైన ఆపర్చ్యూనిటీ (Opportunity) దొరికినది! ఈ సందర్భముతో నీతనికి మమత కలిగించి, దాని యింటికిఁదార్పఁగలిగితినా-నాయదృష్టము, నాలుగుకాళ్ళమీఁద గడిచిన దన్నమాటే! బహుకాలమునుండి దానిపై నాకుఁగల భ్రమయుఁ దీఱును- ఈయెబ్బిచేత నీఁతడు నాచేతి కీలుబొమ్మయగును! ఏమిఛాన్సు (Chance)! టూ బర్డ్సు విత్ వన్ స్టోన్! (Two birds with one stone)

రఘు—ఏమిటి యాలోచించుచున్నావు?

శర్మ...ఏమని చెప్పుదును! దాని యందము చూడలే దనఁగానే నా డెందము క్రుంగిపోయినది.

రఘు...అ దేమి?

శర్మ....అ దేమేమిటి?-ఆ సౌందర్యరాశిని చూడనివి చూపులా!

రఘు...ఎవతె యా యువతి?

శర్మ...దానితల్లి దానికి పెట్టిన పేరు: కస్తూరి...దాని సౌందర్యమును బట్టి లోకులు పెట్టిన పేరు సెర్చిలైట్! (Search light)

రఘు...ఆ కంఠస్వర మాకస్తూరిదే యని నీ వెటు చెప్పఁగలవు?

శర్మ...ఆ సమయమున నేనుగూడ నా మేజువాణీలోనే యున్నాను. ఉండకపోయినను జెప్పఁగలను. అట్టి కంఠస్వరముకల దీయూరిలో నది తప్ప యింకొకతె లేనే లేదు.

రఘు....(నవ్వుచు)అట్లయిన, నీ వీ యూరిలోని ఆటకత్తెల నందఱ నెఱుఁగుదు వన్నమాటయే!

శర్మ...ఎంతమాట! అంతో యింతో చేయునది వైద్యముకదా?

రఘు...అట్లయిన నీసారి యా సెర్చిలైటు వీధిని వచ్చినప్పుడు- ఎన్ని కాండిల్స్ పవరు (Candles power) కలదో చూచెదలెమ్ము.

శర్మ...అట్లయిన మీ కాపవరు రేపే చూపఁగలను!

రఘు—అ దెట్లు?

శర్మ...ఎట్లా?- మరల నొకసారి రవంత మధుసేవ చేసి మనవి చేసెదను. కాసింత మీరుకూడ కానిండు.

ఇద్దఱు...(గ్లాసులు నింపి నోటఁబోసికొనుచుండగా- తెరపడును.)

(ఇది ద్వితీయాంకము.)

# తృతీయాంకము

ప్రవేశము:—కస్తూరి యిల్లు

ప్రవేశము:—కుర్చీపైఁగూర్చుండి శర్మ, యెదుట నిలుచుండి కస్తూరి.

కస్తూ....పంతులుగారికి నామీఁద నేడు పరిపూర్ణకటాక్షము వచ్చినది.

శర్మ...ఇదిగో! మొదలే నేను పుట్టెడు మొగమోటమితో వచ్చినాను! అట్టె పెద్ద మాటలు విసిరి నన్నదలఁగొట్టకు!

కస్తూ...ఎంతమాట! తాయారుమీఁద మీకు తగనియిష్ట మని వాడుక. అందుచేత నట్లన్నాను.

శర్మ...నిజమే కాని - నీచపుముండ నిలుపుకొనలేక పోయినది! కులము వానిని మరగి కూటిలో మన్ను వేసికొన్నది!

కస్తూ...అట్లయిన, దానియింటికి మీరు దయచేయుటలే దన్నమాట?

శర్మ...నీతోడు! నీతో నేనబద్ధ మాడుదునా? కులమువాఁడు పొరలి వెళ్ళిన ప్రక్కమీఁద-కుక్కినపేనవలె గూలఁబడవలసి వచ్చినప్పుడాగుమ్మము త్రొక్కుటకంటెఁ గూడనిపనియున్నదా? ఒక్క తాయారే కాదు—ఇపుడెక్కడఁజూచిన నిదేకర్మము! కులమువాఁడు ముందు- కిలమువాడు వెనుక!

సీ. సోమయాజులుగారి శోభనాంగికి, దాని
మద్దెలకాఁడె కా మాఱు మగఁడు!
ఆచారిగారి సింహాచలంబునకు గ
జ్జెల మోఁతగాడె కా వలపుమగఁడు!
పంతులుగారు చేపట్టిన యిందిరా
స్యకు ఫిడేల్ కాఁడె కా చాటు మగఁడు!
నాయఁడుగారు ప్రాణముపెట్టునట్టి ర
త్తికి తిత్తికాఁడె కా తేరమగఁడు!

పెద్దకోమటి సొమ్ముతోఁ బెరిగినట్టి
మురహరికి తాళగాఁడె కా ముద్దుమగఁడు!
ఇది యది యనంగ నేల యే యింటఁ గనిన
కులమువారలె విటులు సానులకు నేఁడు !

కస్తూ...ఆదోష మెవ్వరి దని మీ యభిప్రాయము?

సీ. సుబ్బిసెట్టి తెనాలిసుందరియింటను
పక్కలు వైచి దీపములు పెట్టు!
పొట్టిపంతులు విరిబోణి మేళములకు
వెదలిన యూరెల్ల వెంబడించు!
కామశాస్త్రిలు పూల కనికి కూఁతుంద్రకు
మగలఁ దెచ్చుటకు రేపగలుఁ దిరుగు!
స్వామినాయఁడు తన సాని నన్మొల కప్ప
గించి, తా వీధివాకిటఁ బరుండు!
కొండమీఁద నున్న గోఁతి కావలెనన్నఁ
జచ్చి యైనఁ దెచ్చి యిచ్చువారె
పాడుపనుల కిట్లు పాల్పడుచుండంగ
సానిముండ లేమి సలుపకుంద్రు?

శర్మ...ఎట్లయిననేమి, ఎక్కడనో నీవంటిది తప్ప, యేయింటఁ జూచి
నను, కులమువాని కుక్క కానిది లేదు!

కస్తూ....సరి సరి. నామాట కేమిలెండు, నామీఁది దయచేత నన్నిట్లు
పొడిగించుచున్నారు!

శర్మ...నీతోడు! నీసంగతి నీయెదుటఁ జెప్పవలసినదికాదు. నిశ్చయముగా
నీవంటివాండ్రు కోటికి నూటికిఁ గొందఱైననుండుట చేతనే ప్రపం
చము నిలిచినది. అందుచేతనే, నిన్నాకాశమున కెత్తవలెనను
తలంపుతో, మంచి స్కీ మొకటి మనసులో స్థిరపరుచుకొని
వచ్చినాను. నీతోడు, నీ యంగీకారమే తరువాయి.

కస్తూ...ఏదో విశేషము లేకున్న మీ రేతెంచువారు కారని నేను మొదటనే
యనుకొన్నాను. ఏమిటి యా స్కీము (**Scheme**)?

శర్మ...జమీందారు రఘునాధరావుగారికిని నాకును, జచ్చినఁ జావు బ్రతికిన బ్రతుకు అనునంత ఫ్రెండ్‌షిప్ (Friendship)

గీ. కుడుచున్నప్పుడు నేనును గుడువవలయు
ముడుచునప్పుడు నేనును ముడువవలయు;
కాయములు మావి రెండుగాఁ గానఁబడిన
మానసం బొక్కటియె కాని మారు లేదు.

కస్తూ...అంతవరకు నే నాలకించినదే.

శర్మ....అట్లయిన నీఁక నంతగాఁ జెప్పవలసిన పనిలేదు. ఆ (Influence) యిన్ ఫ్లూయన్సంతయు నీనిమిత్తము వినియోగించి, నిన్ను బంగారు పిచ్చుకను జేయుటకు నిశ్చయించుకొన్నాను!

కస్తూ....ఏ విధముగా?

శర్మ...ఏ విధముగా నేమిటి?- ఆయనకును, నీకును అతుకు పెట్టి.

కస్తూ...(తనలో) ఇతనిరాక నా కిప్పు డర్థమైనది. కనుక నే నిప్పుడు కాసింత గడుసుతనముగా వెళ్ళవలెను.

శర్మ...ఏమిటి యాలోచించుచున్నావు?

కస్తూ....అనుకొన్న దొకటియు, ఆలకించినదింకొకటియు నైన దని.

శర్మ....నీ వే మనుకొన్నావు?

కస్తూ...(మొగము చిట్లించి) సరే, నే నే మనుకొన్న నేమి! అందని మ్రాని పండున కఱ్ఱులు చాచుట యవివేకము కదా!

శర్మ....అనఁగా?

కస్తూ...అనఁగాను లేదు, వినఁగాను లేదు. కాని, ఆ రాత్రి మీ రాయా రేగింపులోని కెందులకు వచ్చినారు?

శర్మ...అందరు నెందులకు వచ్చినారో, నే నందులకే.

కస్తూరి...అలాగుననా! ఆమాట తెలిసినచో-అందరను జూచినకన్ను లనేమిమ్ములను జూచియుండెడి దానను!(అని చరాలునమరలును)

శర్మ...వెళ్ళకు-వెళ్ళకు-వెళ్ళిననొట్టు! (అని చటాలున లేచి, చేయి పట్టుకొని) ఇప్పుడన్నమాట యేమిటి?—అందరను చూచిన కన్ను

లనే నన్నును జూచియుంటివా? అట్లయిన, స్పెషల్(Special) కంటితోఁ జూచినా వన్నమాటయే! నిజముగా నామీఁద నీకట్టి యభిమానమే యున్నచో-నీపాదములపైఁ బ్రాణములు విడువనా!

కస్తూ....అమ్మయ్యో! - అపనిమాత్రము వలదు! బ్రతికియున్నచోఁ బైమాపులతో నైన భ్రమ తీర్చుకొనెదను.

శర్మ...(సంతోషముతో) వహ్వా! వహ్వా! వన్సుమోర్! వన్సుమోర్! ఏమి యేమిటీ? భ్రమా? - ఎవరిమీఁద? -నామీఁదనే! ఆ బంగారు నోట-ఆ ముద్దులమాట మఱియొకసారి యను!

కస్తూరి...పిల్లికిఁ జెలగాటము, ఎలుకకు ప్రాణపోకడయనునట్లు—నామాట మీ కంత నవ్వులాటగా నున్నది! అదిగో-మరల నవ్వుచున్నారు! పోనిండు. నే నిఁక జెప్పనే చెప్పను! (అని మరలును)

శర్మ...(మరల పట్టుకొని) నాతోడు! నన్ను చంపుకొని తిన్నట్టే! ఏదేదీ?— ఆరాత్రి నన్నుఁజూచినది మొదలు?- చెప్పు మఱి-!

కస్తూరి....చెప్పుట కేమున్న దేమిటి?-

ఉ. అన్నము తిన్న నొట్టు! నిదు రన్నది పోయిన నంతకన్న నౌ!
టెన్నఁడు నిట్టివింత వినియేని యెరుంగను! సిగ్గు సిగ్గు! నా
కన్ను లివెంత దుండగపుఁగన్నులొ—మీ వదనారవిందముం
గన్నక్షణంబునుండి మిముఁ గాంచుటకే పలవించు నిచ్చలున్!

శర్మ...హాయి హాయి! హాయి హాయి! అదృష్ట మనఁగా నాది! ఏదీ ఆపాటున నొక్క-ముద్దు పెట్టు! (అని కౌగిలించుకొని ముద్దాడి) ఇదిగో ఇప్పుడు నాసంగతి చెప్పెద విను. నీకు నామీఁద నిన్ననో మొన్ననో కలిగినది కాని-నీమీఁద నాకు నిరుడినుండి పుట్టినది! అయిన నా స్థితిలో నీయింటఁ గాలు పెట్టుట కిష్టము లేక.

మ. కనులార న్నినుఁ గాంచియైనఁ దనియంగా వచ్చు నం చెద్దియో
పని యున్నట్టులె, వెర్రికుక్క-వపసం బల్మారు నీ యింటివం
కను దారాడుచు—నీవు మేళముల కేగ న్వెంట నేతెంచుచుం
దినముల్పుచ్చితి-నామొర ల్వినియె నాతీ! దైవ మీనాఁటికిన్!

కస్తూ...ఆఁడుదానికిని, మగవారికిని గల యంతర మెంతయో చూచితిరా! నిపుడినుండి మీరు నిప్పుగప్పిననిప్పువలె నుండ-నిన్నఁ గాక మొన్నఁబుట్టిన నావలపు నే నిట్టె బయటఁబెట్టుకొన్నాను.

శర్మ...ఇదిగో-నవ్వకుండ, నామొగమువంకఁ దిన్నఁగఁ జూచి చెప్పు నీవు నిజముగా నన్ను వలచితివా?

కస్తూరి...(చిరాకుతో) ఇదిగో యిదే పురుషులయొద్దనున్న పుండు!

శర్మ...నీతోడు నీతోడు. ఆమాట మరియొకసారి విని యానందింపవలెనని కాని-నిజముగా నీయందు నమ్మకము లేక కాదు. నీ మాట నమ్మనివాఁడు నీయింటఁ గుక్కయై పుట్టు ననుకో! నచ్చినదా? నచ్చినచో, నావంక నొకసారిచూచి ఫక్కున నవ్వు! ఆఁ! చాలును! ఇక్కడి కొకరిమన సొకరికిఁ దెలిసినది కనుక, నిఁక ముందు సంగతిని గూర్చి ముచ్చటింతము. నీకడ నిఁక దాఁపరికమేల—నా మెడికల్ ప్రాక్టీసువల్ల నాకు వచ్చునది నా సిగరెట్లకుఁ జాలదు. అట్లుగాక, నిన్ను నేనే భరింపఁగలిగినయెడల చక్రవర్తికైన నీసాన్నిధ్యము దొరకనిచ్చువాఁడను గాను. అందువల్ల, రఘునాథరావుగారిని నీ కతుకుపెట్టి, ఆయన ద్వారా నిన్నాకాశమున కెత్తుటకును-ఆయన చాటున నీతో నానందించుటకును నిశ్చయించుకున్నాను. నీవుగూడ దీనికి 'ఎస్' (Yes) అంటివా—నీకు నా మీఁద నిజముగాఁ బ్రేమయున్నట్లే లెక్క.

కస్తూ...ఎస్సో గిస్సో నా కేమియుఁ దెలియదు. మగవారియాలోచన మగవారికే గాని - అశుభము శుభము నెరుఁగని యాఁడుదానికేమి తెలియును? అందును నేను వట్టి యమాయకురాలను. నాకంటికి నల్లని వన్నియు నీళ్ళు, తెల్లని వన్నియుఁ బాలు. నీటముంచినను, బాలముంచినను మీఁదేభారము. అవగింజంత కూడ మీ మాట కెన్నఁడు నడ్డు చెప్పుదానను మాత్రము కాను.

శర్మ...అదిగో-అదీ మాట! ఆ మాటమీఁద నీవు నిలువఁబడితివా-యెల్లుండికి నీయొంటిని ఏడువారముల నగలు తగిలించి, ఆవలెల్లుండికి

అయిదంతస్తుల మేడమీదఁగూర్చుండఁబెట్టు భారము నాది. ఈ రాత్రి రఘునాథరావుగారి నిచటి కీడ్చుకొని వచ్చెద. ఒక రహస్యము—ఆయనకుఁ గొంచెము చుక్క యలవాటున్నది; సరే నా సంగతి నీవు వినియే యుందువు. అన్నట్టు, నీ కేమయిన రవంత యలవా టున్నదా?

కస్తూరి...(తనలో) రవంతకర్మ మేమి? పూటఁకు బుడ్డి చాలదు. (పయికి) నా కంతగ నలవాటు లేదు—మీ వంటి వారు తటస్థ మగునప్పుడు మితముగాఁ బుచ్చుకొను వాడుక కలదు.

శర్మ....సరి యిఁక నేమి - చాలును. ఇం కొకటి. ఇంతవఱ కాయన బ్రాంది విస్కిలే కాని — పయిరుచు లెఱుఁగఁడు. పడఁదీసి నీ విప్పుడు పయిగ్రంథములోనికి దింపవలెను. అప్పుడు కాని మన కాయన యంకెకురాఁడు, తెలిసినదా? - సోడా విస్కిలు నేను బంపెదను. తక్కిన పదార్థములు నీవు తయారుచేసి సిద్ధముగా నుండుము. నేను పోయిరానా?

కస్తూరి....అమ్మయ్యో! అప్పుడే వెళ్ళెదరా! శీఘ్రముగా వచ్చెద నని నా చేతిలోఁ జేయి వేసినఁ గాని—నేను వెళ్ళనీయను.

శర్మ... ఓసి వెఱ్ఱిముండా! నిన్ను విడిచి నేను మాత్రము నిమిషముండ గలనా! అమ్మతోడు - తొమ్మిది కొట్టుసరికి ఆయనయు నేను నిక్కడ నుందుము. ఒక్కటే మాట - ఆయాస మాయనది - అనుభవము మనది. ఈ మాట మనసులో నిడికొని, యెట్లు మసలవలెనో యట్లు మసలుము. ఒక్క ముద్దేదీ?. అని ముద్దు పెట్టుకొని, నిష్క్రమించును.)

కస్తూ...(కుర్చీపైఁ గూర్చుండి) మొత్తము మీద నీతనికి నాపై మోజు గానే యున్నది. రఘునాథరావుగా రీతనిచేతి రాట్నపుఁ దిరుగుడుగా నున్నట్లిదివరకు వినియె యున్నాను. ఏమో కస్తూరిరేఖ బయటఁబడు కాలము వచ్చిన దేమో! ఎందులకు గొఱగాని ముండలకుఁ గూడ నెంతలేసి భాగ్యము పట్ట లేదు!

సీ. కూటికిం గుడ్డకుఁ గూడఁ దిప్పలు వడ్డ
మీనాక్షి యద్దాల మేడ కట్టె!
విటులకోసము వీధి వీధియుఁ దిరిగిన
మాణిదివాణంపు రాణి యయ్యె!
కడకు బేడకుఁ గూడ గక్కుర్తిపడినట్టి
కనికికి మోటారుకారు లోదవె!
పగలు గన్గొనినఁ దప్పక రాత్రి కల నగ
పడు రంగి జడ్జికి ప్రాణ మయ్యె!
వర్తకుఁడు, వైద్యుఁడు, వకీలు, వారకాంత-
యనెడు నీ వకారచతుష్టయముదె లక్ష్మి;
ఆదినో, మధ్యనో, లేక యంతముననొ
వెలిగి తీఱుదు రిల నొక వెలుగు వీరు.

మఱియొక విశేషము.

గీ. వర్తకున కూర మేడయు; వైద్యున కొక
పతకమును; న్యాయవాదికి బండి; వేశ్య
కున్నతప్రాపకం బివి యొదవెనేని
పరపతియు, గౌరవము, వచ్చుబడియు హెచ్చు.

కాని, నేను నూవుగింజ వ్యవసాయములోఁ బడి కర్తవ్యము మఱచినాను. సోడా విస్కీలతఁడు పంపును—పట్టెడు కోడిపిల్లతో పయినంజులును సిద్ధము కాగలవు. నా ముస్తాబున కేమిటి దారి? అందును, దొంగకుఁ జీఁకటివలె-వేశ్యకు వేషమే యంగరక్షకము. నా తల్లిముండ—నగలె కాక సన్నచీరలు కూడ సారాయి కొట్లకు సమర్పించువఱకుఁ జచ్చినదేకాదు! నా తల్లిని, నన్నును గూడ మించినవాఁడు నా తమ్ముడు! అయినను, వారి ననవలసిన పని లేదు.

చ. తలఁపగ వారకాంతలకు త్రాగుడు; పాములకున్ సుషుప్తి; తో
ఖుల కమితవ్యయేచ్ఛ గల పుత్రులు; చోరులకుం బణంబు; కా
పుల కెడ లేనికోర్టుతగవుల్: పనివాండ్రకు బద్ధకంబు; బా
పల కసమష్టిదోషమును బ్రాప్తిలకుండినఁ బట్ట శక్యమే!

వెంకటేశము...(సత్వరముగాఁ బ్రవేశించి) అక్కయ్యా! అక్కయ్యా! అగ్గిపోరులాంటి బేరం తగిలింది. అదేఁవి టల్లా వున్నావు?

కస్తూ...నా యుండుట కేమి కాని, ఏమి టాబేరము?

వెంక...కాసింసాహేబు నీమీద కన్నేశాఁడు.

కస్తూ...ఏ కాసింసాహేబు? సిరంవారి మేడలోని సిల్కుబట్టల వర్తకుఁడా?

వెంక....అతఁడే అతఁడే! నిన్న గుమ్మంలో నుంచుండగా నిన్ను చూశాట్ట - అప్పణ్ణుంచీ, అట్టుడికిన ట్టుడికిపోతున్నాఁడు. వట్టి వాజముండాకొడుకు! నేల చూపి నెత్తిగొట్టొచ్చును. ఇదిగో - యీచొక్కా అత డిచ్చిందే. చెపితే నమ్మవు - చేతి కెముక లేదు! రవంత నువ్వు రంగు చేశావంటె రమ్మి పిల్చినట్టు పిల్చె య్యొచ్చును. వీధిలో నుంచోబెట్టి వచ్చాను. ఏఁ వంటావు?

కస్తూ...అట్లయిన, నొక సంగతి చెప్పెద నాలకింపుము! ఈ రాత్రి జమీందారు రఘునాథరావుగారు మనయింటికి రాఁగలరు-

వెంక...(ఆత్రముతో) ఏఁవిటీ! - జమీఁదారుగారే! అబ్బో! అబ్బో! అయితే యింకేఁవి! - అదురుష్టదేవత మా అక్కయ్య చుట్టకు అగ్గిని ప్పందించిం దన్నమాటే! కల్లుకొట్లకు నేను కారుమీద వెళ్ళా నన్నమాటే! వో! వో! వొళ్ళుగరిపొడుస్తోంది! అయితే! అక్కయ్యా! యీకబు రెల్లా వొచ్చింది?

కస్తూ...ఆ సంగతి యావల చెప్పెదను. ముందీసంగతి విను: పనివచ్చె సరి కింట నొక పట్టుచీరయైన లేకపోయినది. సాహేబుకడ నొక సిల్కుచీర సంగ్రహింపఁగలమా?

వెంక....అబ్బే - అదెంత పని. కాస్త నువ్వు కొంగు తాకించావంటే కావల్సినన్ని చీర్లు. ఇదుగో-యీడ్చుకొస్తా, నుండు!(అనివెళ్లును)

కస్తూ...తురకసరసమునకు రవంత చుఱుకుదన మవసరము - చుఱుకు దనమునకు రవంత చుక్క యవసరము. (అనియలమారులోన బ్రాండిసీసా తీసి కొంచెము త్రాఁగును)

వెంక....(కాసింసాహేబుతోఁ బ్రవేశించును.)

కస్తూ....(మందహాసముతో) సలామండి-సాహేబుగారు:!- సలాం!

కాసిం...కంగారుతో సానివారూ మాకి సలాం సెప్తే-సానివార్కి మేం సలాం మీదా సలాం సెప్తాం! అని (సలాం చేయును.)

వెంక...అక్కయ్యా! సాహేబు బావయ్యగారికి నీమీద చాలా సరద పుట్టింది. నిన్నట్నుంచి నీకోసం-నిప్పు తొక్కిన కోతిలాగున్నారు వొఖ ముద్దెడితివా-వొందరూపాయి లిస్తారు. ఏం బావయ్యగారూ

కాసిం....ఠీక్ ఠీక్! మనుషులోదీ మాటా-బయటికి - బరాబర్ తీసి - ము ముంగలా యేశాడ్. ఘుమ్మంలో మిమ్మల్ని సూశాం-ఘుప్పున మొఘాన్ని ఖన్నూయేశాం - ఘుండెల్లో, ఘుబుల్ ఘుబుల్ బయదెల్లింది. సాపుకి యెల్లాం - సందుగాకాడా కూకున్నాం ఘుండెల్లో, ఘుబుల్, ఘుబుల్, ఘుబుల్! నమాజ్ సేస్కున్నాం నాస్తాకాడా కూకున్నాం-ఘుండెల్లో, ఘుబుల్! ఘుబుల్! ఘుబుల్ బీడీ గిడీ కాల్సుకున్నాం-బిశానామీదా తొంగున్నాం. ఘుండెల్లో ఘుబుల్! ఘుబుల్! ఘుబుల్! కండికి రెప్పా తగిత్తే-గాడ్డీ మాం వొఖటి!

కస్తూ...మీ గుబులు నేను తీర్చెదం గాని-యిటు వచ్చి యీ కుర్చీపై గూర్చుండుడు.

కాసిం...మాకి కూకో మంటే కూకుంటాం-మల్లీ-గులామల్లీ కమ్మంటే గులామల్లీ అవుతాం.

వెంక...బలే! బలే! మా బావయ్యగారిమాటే పయ్యాడింది!

కాసిం...(సంతోషముతో) అరే! అరే! అరే! మాదీ మాట - మీద ఆడిందీ వోయ్! మంచీమాట సెప్పిందాన్కి మల్లీ - యీనా విస్తా పుచ్కో! (అని జేబులోని రూపాయలు తీసి) ఏక్, దో, తిన్ చార్, పాంచ్,! (అని చేతిలో వేయును).

వెంక....(తనలో) నాది నాకు ముట్టింది! ఇప్పుడు నా పనేమీ లేదు. ఇంతలో వోసారి కొట్టుకాడికిపోయి చక్కావస్తాను. (నిష్క్ర)

కస్తూ....ఇటువచ్చి కూర్చుండరేమి? (అని చేయి పట్టి లాగును).

కాసిం...(పారవశ్యముతో) హ్వా! హ్వా! క్యామజారేబాబా! క్యామజా!

కస్తూ...అయ్యో దేవుడా? అదే మట్లు కన్నులు తేలవేయుచున్నాడు! కొంపతీసి గోవింద కొట్టడు గదా! (చేయి విడుచును)

కాసిం...అరే! అరే! సచ్చిపోయాం! సచ్చిపోయాం! సానివారూ! మీకి సలాం సేస్తాం-సెయ్యికి సెయ్యి తగిలి పిచ్చి – సెనం వూరుకోంది! మీదీశై తగిలేతల్కి–మాది పానం వక్కాయెల్లింది!

కస్తూ...ఆలాగునవా! అట్లయిన, నీసారి రెండుచేతులు తగిలించెదలెండు. (అని రెండు భుజములమీదను రెండు చేతులు వేయును).

కాసిం...(పారవశ్యముతో) అచ్ఛా! అచ్ఛా! అల్లా మీ సేతుల్లో అవల్ ఖుషి-బలె షౌఖ్యం పెట్టాడండీ! అందుకుశాత - బలే బలే వోళ్ళంతా–మీ పాదాల్ మీద పానం యేస్తారు.

కస్తూ... మా చేతులకు మీ అల్లా మఱియొక గుణముకూడ పెట్టినాడు. మీ జేబులలో ప్రవేశించువఱకును మిలమిల లాడక మానవు. (అని జేబులు తడవి, యందలి నోట్లుతీసి) ఆఁ ఆఁ, నోట్లు, నా కొరకే తెచ్చియుంటారు. నబాబు దర్జా యనగా ఇది.

కాసిం...అదీ మాట! ఆఫ్కా దయా మాకీ షల్లంగా వుంటే, కుక్కల్ సేతా నోట్లూ కుప్పల్ కుప్పల్ కక్కిస్తాం.

కస్తూ....అంతవారే మీరు. అన్నట్టు కూర్చుండరేమి? (అని లాగను)

కాసిం...వొస్తాం! వొస్తాం! జర్రా నిలండీ! (అని కాళ్ళ జెడావులు తీసి చేతఁ బట్టుకొని) బస్! చెలో!

కస్తూ....(నవ్వు బిగబట్టుకొని) చేతిలో జెడావు లెందుకు?

కాసిం...క్యా! జెడావ్ చోడ్దేనా? అచ్ఛా (జోడు క్రింద వైచి కూర్చుండి) మల్లీ పీర్కు కోందీ మాపానం వోరుస్తాదండి?

కస్తూ...అట్లయిన నిదిగోఁ గూర్చుండెద (అనియొడిలో గూర్చుండును)

కాసిం.. (పారవశ్యముతో) అచ్ఛా! బోహటచ్ఛా! అవల్ ఖుషీ యిప్డూ అందకుండే! ఉమరా వస్నూ పలవ్ దెక్కాలో పక్కా యేసీ

మాష్మీపండ్లో మకాం సేసీ, హల్వామేసీ, హంఝూరా కొర్కీ, జీ
కాల్చి, గుడాక్ పీల్సి, గుమ్మయ్యిపొయ్యింది.

కస్తూ...సరి కాని; సాహెబుగారు! మీ కీ గడ్డ మెందులకు?

కాసిం...బోల్నా? కాపోడ్కి కాడీ; కమ్మోడ్కి పాడీ; గుమ్మాన్కి సీ
ఖులాసాకి బీడీ; పడుసోళ్ళకి జోడీ; పలావుకి కోడీ; రవుతి
ఘోడీ; రండేకి కౌడీ; ముల్లుకి జీడీ; ముసల్మాన్కి దాడీ; ముఖ
ముఖం. మీ అందాన్కి తోడూ మీమూత్కి దాసివుంటే, సబ్బ
మీ పాదాల్కాడా సచ్చింది మాట.

కస్తూ...అయితే, హిందువులకు మీరన్నిట వ్యతిరేక మటే కా?

కాసిం....అదీ మాటా! హిందువాడూ మీవాపెంచీ కిందా గొర్గితే, మా
కిందా పెంచీ, మీదా గొర్గుతాయ్. హిందూవాడూ హెడం నుం
ఖుడ్కి రాస్తే, మాది ఖుణ్ణుంచి హెడాన్కి రాస్తాయ్. హింద
వాడూ హేదం నమ్మతే, మాదీ ఖురా న్నమ్ముతాయ్. హింద
వాడూ శపం చేస్తే, మాదీ నమాజ్ సేస్తాయి. హిందూవాడూ కా
యెల్తే, మాదీ మక్కాయెల్తాయ్.

కస్తూ....హిందువులు కాళ్ళతో నడువ, మీరు తలతో నడువ రేమి ?

కాసిం...మాకి తలా నేలకి తగిలిపిస్తే మాసిపోదండీ ?

కస్తూ...మాసిపోయినచో, మడేలువానిచే నుతికించుకోవచ్చునుగా?

కాసిం....వుత్కితే దాడీ వూడీ పోదండి?

కస్తూ...(పక పక నవ్వి) అదా వచ్చినచిక్కు? (తనలో) అవురా!
అమాయకత్వము! కనుకనే, యంత సామ్రాజ్యమును గంగలో
గలిపి, కుట్టుపనికిని, గుమ్మము కావలికిని సిద్ధమయినారు
(పయికి) సాహెబుగారు! మీ పూర్వు లెంతటివారో యెరుగుదురా

కాసిం....జజ్జా సెప్పండి యింటాం.

కస్తూ...చెప్ప మనెదరా? (అని లేచి)

సీ. భరతఖండం బెల్ల పాలించి సిరులతోఁ
దూగినవారు మీ తురకవారు

కాసిం...అదీ మాటా, యిందండి యీనాం (అని యుంగర మిచ్చును

కస్తూ...వీరలై పోరుల వీరాధి వీరుల
ద్రుంచినవారు మీ తురకవారు

కాసిం...అచ్ఛా! అచ్ఛా! మా సేతిక్కి కత్తి యిస్తే-మజా సూస్తాం.

కస్తూ....నవరత్న సింహాసనంబులఁ గూర్చుండి
తొడరినవారు మీ తురకవారు

కాసిం...(దిగ్గున లేచి) థూ, కుర్చీమీదా కూకుండీ-కుక్కా అయ్యాం.

కస్తూ...భోగంబునందును త్యాగంబునందును
తులలేనివారు మీ తురకవారు

కాసిం...బరాబర్! పండగా దిగ్తే, పలావ్ మీదా పడీ సచ్చిపోతాం!

కస్తూ....శూరవరులకు జాగీరు లూరి కొలువు
కాంద్రకెల్ల మిరాసీలు కవుల కగ్ర
హారములు, పండితులకు మాన్యంబు లొసఁగి
తుఱఁగలించినవారు మీ తురకవారు!

కాసిం...అదీమాటా! అంతా సెప్పిందాన్కి సానీవార్కి మేం సంతోషం
సేస్తాం, కోరండి, ఆఫ్కా ఖుషీ, కోరండి!

కస్తూ...మాట తప్పరుగద?

కాసిం....మాటా తప్తే, తురకా బిడ్డా మానీ, దూదేక్ బిడ్డా బోలో!

కస్తూ...అయితే, ఈరాత్రి సిల్కుచీర కట్టుకొని హాయిగా మీతో నుండ
వలె నని యున్నది. పంపెదరా?

కాసిం...యిస్కా మాకీ తుఖ్ఖా-యిదాసెప్పింది. కాకీ మీదా యేసి, కట్టా
సీరల్ పంప్తాం-తమర్కి నచ్చి అయిందీ రీతాఫ్ సేస్కోండి.

కస్తూ...కాకి మీఁదను వలదు. గాడిదమీఁదను వలదు. అడుగో మా
తమ్ముడు వచ్చుచున్నాడు. అతనిచేతఁ బంపుఁడు.

కాసిం...అదీమాటా! హాదాగంటా హవ్వే తల్కి, హక్కా సీరల్ హిక్కా
హొంద క్పోతే-మాదీ బాత్-మంజూర్ సెప్పకండీ.

వెంక...ఏఁవి టక్కయ్యా! యేఁవిటి?

